శ్రీ గురుభ్యో నమః.

శ్రీ

# నగజా శతకము



కవయిత్రి

చక్కా కోటివీరభద్రమ్మ

వల్లూరుపాలెము, తోట్లవల్లూరుపోష్టు.

బెజవాడతాలూకా, కృష్ణాజిల్లా.



[వెల రు ౦-౧-౦

శ్రీ గురుభ్యోనమః

శ్రీ

# నగజాశతకము.



కవయిత్రి

చుక్కా కోటివీరభద్రమ్మ

వల్లూరుపాలెము, తోట్లవల్లూరుపోష్టు.

బెజవాడతాలూకా, కృష్ణాజిల్లా.

# విజ్ఞప్తి వాక్యములు



మహాశయులారా! మనవి వినుడి!

శ్రీమద్వేద కావ్యస్మృతి దర్శన తీర్థ సాహిత్య విశారద ధర్మాచార్య విద్యానిధి విద్యారత్నాది బిరుదాంకితులు నాధునిక వీరశైవ మతోద్ధారకు లగు శివ శ్రీ పండిత చిదిరె మఠము వీరభద్రశర్మగారి పాదపద్మంబుల కెరగెద.

పతిపూజఁ బాయక ధృతమతిని నాగార్యుని
క్షితిఁగలదాక మతిలో గొనియాడెద.
లక్షణము నేర్పిన లక్షణవంతుని
గొనియాడుచు తనివి జెందెద
పిన్న పెద్దలను చిన్నియన్నలను
పండితవరులను దండి కవీంద్రులను
ఒప్పులఁగాని తప్పులఁ ద్రోసి
తప్పక నాకవితను మెప్పుకు తేగలరని
కరములమోడ్చి శరణము చేసెద.

వల్లూరిపాలెం,
8_1_1940.

ఇట్లు,
కవయిత్రి.



ఓం.

# పండితాభిప్రాయము



తన ముద్దుల మేనగోడలిని సంబోధించు తలంపున భక్తి నీతి సదాచారములను సరళమైన భాషలో బోధించు పద్ధతిని రచింపఁబడిన "నగజాశతకము" నవలోకించి యమందానంద మందితిని. ఆధునికాంధ్ర వీరశైవప్రపంచమున శతకకర్త్రి యీమె యొక్కర్తుకయే యనుట అభిమానవిషయము. భాషాపాటవ మల్పమైనను భావప్రౌఢిమ కొరతవడలేదు. వయసున చిన్నదైన గుణమున మిన్నయైన ఈ కవయిత్రికి నభ్యుదయపరంపరల నా నగజాధీశుఁ డనుగ్రహించుఁగాక యని యజస్ర మభిలషించుచున్నాను.

సికింద్రాబాదు,
వీరశైవ గురుకులము,
ది 31--12—1939.

చిదిరెమఠము వీరభద్రశర్మ.



ఓం

శ్రీ గురుభ్యోనమః.

# నగజా శతకము.

క॥ శ్రీగౌరీ ప్రాణేశుడు
బాగులును చిరాయు విచ్చి బ్రతికెడు దనుకన్
శ్రీగౌరియుఁ గుంకుమ నిడి
బాగుగ నిను మనుచునమ్మ వసుమతి నగజా! 1

క॥ శ్రీకంఠురాణి ననిశము
ప్రాకటముగ గొల్చుచుండి భక్తి నుతింతున్
నా కెప్పుడు రచనంబులఁ
జేకూర్చు సహాయవితతిఁ జెల్వుగ నగజా! 2

క॥ గిరిజేశుని యనఘాత్ముని
కరుణానిధిఁ గాశినాథు గందర్పహరున్
దురితాంధకారభానుని
పురహరునిం దలతు భక్తిఁ బుడమిని నగజా. 3

క॥ పనులను చెరిపెడి దొరయై
తనుఁ దలచిన వారి కెందు దప్పక భువిలోఁ
బనులను పూర్తిని జేసెడి
ఘనుడగు విఘ్నేశుఁ దలతు ఘనముగ నగజా. 4

# శ్రీ నగజా శతకము

క॥ శ్రీ వీరశైవమతమును
గావించిన శంభుసములఁ గైవల్యుల స
ద్భావులఁ బంచాచార్యులఁ
భావింతును నిష్టసిద్ధిఁ బడయఁగ నగజా. 5

క॥ వసుధను భక్తులపాలిట
నసమూత్ముం డనగఁ బరగి యర్థించిన వే
వెస నర్థంబుల నిడు నా
బసవేశుని గొలుతు భక్తి ప్రబలగ నగజా. 6

క॥ సదమల విద్యాంభోనిధిఁ
జిదిగెమఠకులాబ్ధిచంద్రుఁ జిన్మయరూపుఁ
సదయుఁడగు వీరభద్రుని
విదితుని శ్రీ గురుకులేంద్రు వేడెద నగజా. 7

క॥ కరిబసవుని గురుకులమణిఁ
బరమాత్ముని లింగమందు ప్రబలిన ఘనునిఁ
సిరిపతి సుతమదహారుని
స్థిరభక్తిని దలతు మదిని చెలగగ నగజా. 8

క॥ గురుదీక్షను నా కొసగిన
గురుడగు శ్రీ శంభుమూర్తిఁ గుటిలారియునై
చరియించిన ముమ్మడికుల
వరునిం బ్రార్థింతు నెపుడు భక్తిని నగజా. 9

క. జనకునిఁ బట్టిసవీరయ
ఘనభక్తుని వైద్యవరుని § కల్మషహారునిన్
మన మలరగ నను పెంచిన
యనఘాత్ముని గొల్తు భక్తి § ననిశము నగజా. 10

క॥ నను గని ముద్దుగ సాకిన
జననిఁ శ్రీశంభుపాద § స్మరణముతో నా
మనసిజహరుపురి కేగిన
ఘన నాగమ దేవిఁ దలతు § ఘనతగ నగజా! 11

క॥ చిరుతపు ప్రాయంబున నను
గరుణను దిలకించినట్టి § ఘనదంపతులన్
ధర సంగయ మల్లాంబల
స్మరియింతును భక్తి గదుర § జగతిని నగజా. 12

క॥ మక్కువతో నాకెప్పుడు
చక్కని సద్విద్య నేర్పి § సల్లక్షణమున్
జిక్కించు మల్లికార్జును
లక్కన కులవరునిఁ దలతు § రహించే నగజా. 13

క॥ పతియే గతి యను ధర్మము
మతియందున గుర్తు నిలిపి § మామక పతియా
మతిమంతుని నాగార్యుని
సతతము నే గొలుతు భక్తి § చక్కని నగజా. 14

# శ్రీ నగజా శతకము

క॥ లలి మాయమ్మ సహోదరుఁ
బులకంటికులాబ్ధిచంద్రుఁ బుణ్యచరిత్రున్
లలి సంగయార్యవర్యుని
తలచెద ననిశంబు భక్తిఁ దనరఁగ నగజా. 15

క॥ పెదయగ్రజు బసవార్యుని
ముదమున శ్రీ యల్లమార్యుఁ బుణ్యసుశీలున్
సదయుడగు వీరభద్రుని
మది మఱువకఁ దలచుదాన మనమున నగజా. 16

క॥ శాంతిమతిని నా కక్కన్
కాంతుని పదసేవఁ జేసి కైలాసపతిన్
చింతనఁ జేయుచు చేరిన
యింతిని మహాదేవి దలతు నెప్పుడు నగజా. 17

క॥ భవభూతిని బసవార్యుని
కవిరాజును నన్నెచోళుఁ గాళీదాసున్
భువిపై బూసామల్లయ
కవివరు నే దలతు భక్తి గదురఁగ నగజా. 18

క॥ సిరిగలదంచును పురుషులు
పరులను హింసింపఁ జనదు పాండవులను నా
కురునాధుడు నిందించుటఁ
ధరఁ బడెగా భీముచేతఁ దప్పక నగజా. 19

క॥ పట్టిన దీక్షను విడువకఁ
గట్టిగఁ గష్టాలకోర్చి § కాపుర మెప్పుడున్
దిట్టతఁ జేయుచు నుండిన
పుట్టింటికి కీర్తి కలుగు § పొలుపుగ నగజా. 20

క॥ ఇంటింట తిరుగ కెప్పుడు
తుంటలతో చెలిమిచేయ § దొడరకు, పోరే
కంటక మని గుర్తెరిగియు
తంటాలను తెచ్చుకొనకు § ధరణిని నగజా. 21

క॥ తిట్టిన యత్తను మామను
కొట్టిన నీ మగని నెపుడు § గొంకక మదిలో
రట్టును పెట్టుట మానియు
దిట్టరివై మెలగుచుంట § దివ్యము నగజా. 22

క॥ ఇట్టివె ప్రేమను పెద్దలు
గట్టిగ బోధించునట్టి § ఘనధర్మములన్
గట్టిగ గ్రహియించియు నె
ప్పట్టున విడనాడకుంట § భవ్యము నగజా 23

క॥ పతిభక్తే భవనాశము
పతిభక్తే ప్రాణరక్ష § వనితామణికిన్
పతిభక్తికి సమమగునది
వ్రతరత్నము లేదదెందు § వసుధను నగజా. 24

క॥ పతిభక్తియె సతి కెందును
గతియై సచ్ఛక్తు లిచ్చి కాపాడు సుమీ
సతి సావిత్రియు నెన్నగ
పతిభక్తినిగాదె పేరు పడసెను నగజా. 25

క॥ తల్లిని దండ్రిని పెద్దల
నుల్లంబున గొలుచుచుండి యురుతరభక్తిన్
ఉల్లజహరునిని దలచుచు
నెల్లెడఁ జరియింప మేలు లెసగును నగజా. 26

క॥ పరులను దూషణఁ జేయక
పరమేశుని భక్తిగదుర భక్తాళికి దా
శరణులు చేయుచు భువిపై
చరియించుట నీతియండ్రు జనునకు నగజా. 27

క॥ ఇరుగు పొరుగువారలతో
నిరుపమయనురక్తిఁ జూపి నేర్పున సఖివై
పరుషంబుల నాడక యా
పరుషంబుల నీవు పడక ప్రబలుము నగజా. 28

క॥ బావలు మఱదులతోడను
గావింపక నిష్ఠురోక్తి కరుణామయివై
భావింపుము బంధువులని
గావించుము గౌరవంబు ఘనముగ నగజా. 29

క॥ హృదయేశుని యానతులను
మదమున శిరమందు దాల్చి ‡ మోదంబున నా
హృదయేశుమీద ప్రేమను
మదియందున నిల్పుచుంట ‡ మంచిది నగజా. 30

క॥ ధనముండిన సుతు లుండిన
జనుడెందున గర్వపడుట ‡ చేటగు తానే
ఘన దేవుం డని పలికిన
వనజోద్భవు డెన్న బంధి ‡ బడయడె నగజా. 31

క॥ పరపురుషులు సోదరులని
జరపుచు నన్యోన్యమైత్రి ‡ చక్కగ గని ప
చ్చరితుల సేవింపుచు నీ
వరునాజ్ఞను మీరకుంట ‡ భవ్యము నగజా. 32

క॥ కష్టంబులు గల్గిన యెడ
నిష్ఠురములు పలుకకుండి ‡ నిర్మలమతితో
కష్టసుఖంబుల నొకటని
నిష్ఠను విడ నట్టివాడె ‡ నేర్పరి నగజా. 33

క॥ గురునిందయు పరనిందయు
పరమేశుని దూరుటయును ‡ పాపం బని తా
నెరుగక చరియించినచో
దురితంబుల బడయకున్నె ‡ దుష్టుడు నగజా. 34

క॥ దిన దినమందున నియమము
గని, శివపూజలను జేయ కల్మష హారమౌ
మును కన్నప్పయు గాంచడె
తననియతర పూజచేత ధన్యత నగజా. 35

క॥ విద్యల నేర్చిన ఫలముగ
వేద్యం బైనట్టి తోవ విడువక హరునై
వేద్యముగా సత్క్రియలను
గద్యంబుల గూర్చు టెల్ల ఘనమగు నగజా. 36

క॥ కట్టిన శివలింగము నె
ప్పట్టున బాయంగ రాదు పరికించినచో
నట్టుల విడువం బతి విడిచి
నట్టి కులటవోలె కీడు నందును నగజా. 37

క॥ సత్యమె యశముకు మూలము
సత్యమె భవమోహపాశ సంసృతి బాపున్
సత్యమె శీలము నిలుపును
సత్యముతో నెట్టి వ్రతము చాలదు నగజా. 38

క॥ పంచాక్షరి భవహరణము
పంచాక్షరి మోక్షనెలవు పరికింపగ నా
పంచాక్షరి సరితూగెడి
ఎంచగ మంత్రంబుగలదె యిలపై నగజా. 39

క॥ భూతియు రుద్రాక్షుల వి
భ్యాతిగ ధరియించి భక్తి ౯ గౌరీపతిఁ దా
చేతులఁ దాళము వేయుచు
నాతత కీర్తించువాడె ౯ యతి యగు నగజా. 40

క॥ మాటలు తీపిగ నుడువుచు
బూటకముల జేయువారి ౯ బోధలు మదిలో
నాటిన కీడొదవునుగా
చేష్టల విడచు విషము ౯ చేరిన నగజా. 41

క॥ మంచిగ నింటను జొచ్చియు
సంచులలో నున్న వస్తు ౯ సముదయ మెల్లన్
వంచనఁ జేయుచు కొనెదరు
ఎంచగ గజదొంగ లంద ౯ రెఱుగుము నగజా. 42

క॥ లలిశివభక్తియు బడసిన
తొలివార్ధిలును దాటవచ్చు ౯ ధూర్జటి కృపచే
నిల శివభక్తియుచేతనె
యలమార్కండుడు చిరాయు ౯ వందడె నగజా. 43

క॥ అంగము మాయామయ మగు
లింగము సర్వేశుగుర్తు ౯ లీలను మది నా
యంగత్రయములుఁ చన, లిం
గాంగంబుల నేకదృష్టి ౯ గాంచుము నగజా. 44

క॥ తియ్యని పలుకుల నుడువుచు
వెయ్యారుల భక్తినెంచి ƒ విజ్ఞానియునై
యయ్యలు కోరినవరముల
నెయ్యెడ దా దీర్చు బసవ ƒ డింపుగ నగజా. 45

క॥ ధరజంబులు ఫలియించిన
కరము శకుంతములు చేరు ƒ కైవడి భువిపై
సిరిగలిగిన తరి యందరు
దరిఁ జేరుదురమ్మ యిద్ది ƒ తథ్యము నగజా. 46

క॥ చదివినకొలదిని నరునకు
సదమల విజ్ఞానము మృదు ƒ సంభాషణముల్
విధిహితచర్యలు పూజ్యత
లెద సంతోషంబు లమరు ƒ నిలపై నగజా. 47

క॥ వేకువ యందున మేల్కని
ప్రాకటముగ పనుల చేసి ƒ ప్రవిమలమతితో
పాకంబుల గావించియు
నీ కాంతుని మెప్పు బడసి ƒ నెగడుము నగజా. 48

క॥ ధర్మంబుల నరయుటకై
నిర్మల విజ్ఞానమంద ƒ నేర్పరివై స
ద్ధర్మాత్ముల సేవించుచు
మర్మంబుల గాంచవలెను ƒ మనుజుఁడు నగజా. 49

క॥ దీక్ష విధంబులఁ దెల్పక
కుక్షింభరు డగుచు దుష్టగుణములతోడన్
దక్షిణ గొనుటయె కాకను
కక్షలు దగ బెంచువారు ఖలు రిల నగజా. 50

క॥ శివనింద జేసి మురిసెడి
భవు లందరు శిక్షబడసి వనటం బడరే?
శివనిందచేసి దక్షుడు
శివతనయునిచేత శిక్ష జెందడె నగజా. 51

క॥ శివభక్తుల గని గర్వము
దవిలియు నిందించుచుంద్రు తామసికులు నా
శివలింగము నెలకొలిపియు
నవనిజపతి పూజ లిడుట నరయక నగజా. 52

క॥ మతధర్మములం గాంచియు
మతికులు తన బిడ్డలంచు మక్కువఁగనిఁ దా
హితవచనంబుల బోధల
జతగూర్చెడి వాడె వీరశైవుడు నగజా. 53

క॥ గురువుల సేవింపుము యా
గురువులు బోధించునీతి గొనుచును దానిన్
మరువక నడకలో పెట్టుము
గురువుల సాయంబు కనుచు గొంకక నగజా. 54

క॥ ధర శూరుడ నే నంచును
గురుతర సద్గుణము కనక | కుటిలుడు భువిలో
హరభక్తుని నిందించును
కరిగని శునకంబు నరచు | కరణిని నగజా. 55

క॥ లింగంబును లింగాంగుని
షొంగుచు హసియించు పాప | భూయిష్ఠుడు నా
మంగలి కత్తులు కలవని
సంగరమునఁ జొచ్చురీతి | జగతిని నగజా. 56

క॥ జననం బెత్తిన కులమున
తన మత యాచారమందు | ధర్మము లెడలక
ఘనతర శ్రద్ధలఁ బరపియు
మనుచుట విధియండ్రు ప్రమథ | మణికిని నగజా. 57

క॥ అతిథులు వచ్చిన ప్రేమను
జత గూరిచి వంటకములు | చక్కఁగ నిడి స
మ్మతి నాదరమును చూపుట
నతి సుకృత మటండ్రు బుధులు | నాతికి నగజా. 58

క॥ క్షితిపై కొందరు భక్తులు
మతియందున శివుని దలచి | మాన్యులు నైదు
ర్మతులకు చిక్కఁక భవములఁ
ధృతమతి నాశంబు జరుపఁ నెంతురు నగజా. 59

క॥ స్థిరతరభక్తిని శంభుని
గురుతర నీమంబుగల్గి కోరిక విడి నా
హరు జపియింపక జాలముల
బురబుర మున్గిన ఫలంబు పొందునె నగజా. 60

క॥ అప్పు ముప్పును తెచ్చును
తప్పు యుపకీర్తి తెచ్చు తనపతికిం బెక్
తప్పుల జుట్టెడి కులటయె
తప్పక కులకంటకంబు తథ్యము నగజా. 61

క॥ గుణహీనుని దయచేస
ద్గుణవంతుని జేయ బోధ గొనకొని నిడ దు
ర్గుణములఁ బాయక సద్గుణ
గుణముల నిందించుచుండు కుటిలత నగజా. 62

క॥ లింగము కట్టినయందుకు
లింగములో దృష్టి నిలిపి లింగాంగుల స
త్సంగముచేయుచు భక్తుఁడు
లింగము పూజింపవలెను లీలను నగజా. 63

క॥ దేవుఁడు లేడని కొందరు
గావింతురు వాదవితతి గర్వంబున నా
దేవుఁడు లేకుండినచో
నేవిధి సృష్టి స్థితిలయము లెసగును నగజా. 64

క॥ సురతాప్తిగిన, నారోగ్యము
సిరియుం, దన వంశయశము ƒ చిత్తస్థిరముల్
సురుచిరవిజ్ఞానంబును
ధరస్త్రై నశియించు సిద్ధి ƒ తథ్యము నగజా. 65

క॥ పేకాటలు దగఁబెరుగుట
నీకాలమునందు పుణ్య ƒ మొసగించెడి యా
శ్రీకంఠుని కథవినుటలు
నేకడనైనను నశించె ƒ నిలపై నగజా. 66

క॥ చక్కెర పొడిగలచోటుకు
మక్కువతో చీమ చేరు ƒ మాడ్కిని భువిలో
ముక్కంటి మంత్రముండునొ
యక్కడకే శివుఁడు చేరు ƒ నరయఁగ నగజా. 67

క॥ ఇంటిని శుభ్రముచేయుచు
వంటకములఁ గూర్చుచుండి ƒ పతికే మొదలన్
కంటకముగ వర్తింపక
నుంటను శుభమందుర్ఘనులు ƒ నొప్పుగ నగజా. 68

క॥ నాథుఁడు చనువున మెలగిన
చోఁ దగు వినయంబు చూపి ƒ సౌఖ్యదలిర్పన్
మోదంబున చరియించిన
రాదమ్మా! పోరు నింట ƒ రగులుచు నగజా. 69

క॥ దయ్యంబులు కలవంచును
ఎయ్యెడ మది నెంచరాదు ౹ యీశుని పతినిఁ
నెయ్యంబున సేవించిన
దయ్యాలకు తావుగలదె ౹ తలపగ నగజా. 70

క॥ మతిలో ననుమానంబులు
జతబడి దయ్యాలపోతు ౹ సన్నిధి కేగన్
యతికించు ధనాశను నీ
పతిగను భయమందునట్లు ౹ యరయగ నగజా. 71

క॥ భూతేశుని మది తలచుచు
నేతరి ధైర్యంబు విడక ౹ నేర్పును కని యీ
భూతలమందున తిరిగిన
భూతంబులు చేరగలవె ౹ పుడమిని నగజా. 72

క॥ ధర కొందరు సన్యాసులు
గురుతత్వము తెలుపలేక ౹ కుమతిని శుభమే
మరయక దయ్యాలని భువి
నరులను బెదరించుటెట్లు ౹ న్యాయము? నగజా. 73

క॥ తన తనువును తన ధనమును
తనపేరును నిల్పఁజాలు ౹ తరుణపు నడకల్
విని యోగించిన, తరుణము
గననేరని తను ధనములు ౹ కాల్పనె నగజా. 74

క॥ చెడిబ్రతుకుట సులభంబగు
పుడమిం దా బ్రతికి చెడుట పురుషున కెందున్
కడు కష్టము పూలమ్మిన
తలమున పేళ్లమ్మగలరె ? ధన్యులు నగజా. 75

క॥ కాసుకు కాసుకు గణితము
వేసుక జీవించి ధనము వేలుగ గొనినన్
వాసికి వ్యయమును చేయునె?
రోసంబులు పాయుగాని లుబ్ధుడు నగజా. 76

క॥ కాలము రిత్తగఁ బుచ్చక
చాలగఁ బురుషార్థ వితతి సరగున గొనగన్
లీల జరించెడి పురుషుడె
బాలశశాంకునికి పోటుబంటగు నగజా. 77

క॥ శివుడే దైవంబనుచును
శివుడే తన భర్త యనుచు సిద్ధత్వముతో
దవిలియు ధ్యానించుచు నీ
భువి మత సేవకుడు నగుట పుణ్యము నగజా. 78

క॥ ఎందుకు జన్మము నెత్తుట
లెందుకు పడరానిపాట్లు ఎప్పుడు పడుటల్
ఎందుకు నాశకు చిక్కుట
లందున ఫలమేమిగలదొ యరయగ నగజా. 79

క॥ అందమె మనతనువులు? కీ
డందక యుండగలవె ధర ననిశము? శుభముల్
పొందునె యెప్పుడు? పురుషులు
నెందుకు పేరాసఁ బడుట లెరుగుము నగజా. 80

క॥ తనువును ధనమును విడువక
తన పేరును నీటగలుపు ధర లుబ్ధుడు నా
ఘనుడట్లు గాక పేరుకు
తనుధనముల నిచ్చునమ్మ తలపగ నగజా. 81

క॥ ధరపై వేత్తను నేనని
నిరతము తనకీర్తినుడివి నెగడుచును భళీ
గురుశీలుర నిందించును
గరువంబున నీర్ష్యచేతఁ గలుషుఁడు నగజా. 82

క॥ కక్షలు పుట్టించుటకై
రక్షకులకు చేటుగూర్చి లక్షణపరులే
పక్షము నాతో సరియని
శిక్షలఁ గనకుండి వదరు చెనటియు నగజా. 83

క॥ శీలము విద్యయు కలిమియు
చాలగఁ దగఁ గలుగుచుండు సమయమునందున్
పాలసునకు గర్వంబగు
చాలగ వినయంబులెసగు సదయకు నగజా. 84

క॥ తరుణము లందునె సత్క్రియ
పురుషుడు తన ప్రజ్ఞచేత ౯ పూరించినచో
స్థిరతర యశమున దనరును
తరుణంబుల బాసెనేని ౯ దనరునె? నగజా. 85

క॥ జననము కలిగిన యందుకు
ఘనతర సత్కీర్తిమోక్ష ౯ కార్యంబులఁదా
ననువుగ చేయుట ఫలమగు
ఘనులగు సజ్జనుల కెందు ౯ గట్టిగ నగజా. 86

క॥ చెట్లులు ఫలముల నిచ్చియు
గట్టిగ నుపకార వితతి ౯ గావించుటఁ దా
నెట్టన గ్రహియించియు జను
డట్టుల నడువంగ చెల్లు ౯ నవనిని నగజా. 87

క॥ దుష్కర్మల భేదించియు
నిష్కాముం డగుచు భక్తి ౯ నిశ్చలుడై యా
యుష్కాలము సత్క్రియచే
నిష్కల్మషుడైన వాడె ౯ నేర్పరి నగజా. 88

క॥ శిలకును మణికిని భేదము
గలిగియు మారనివిధంబు ౯ కలుషాత్ములకున్
సలలిత సత్క్రియపరులకు
నిలగల వలె నొప్పుచుండు ౯ నిక్కము నగజా! 89

క॥ మంచిని గ్రహియించియు ని
ర్వంచకుడై యీశుభక్త ƒ పాదంబులకున్
ఎంచియు మ్రొక్కుచు ధర్మం
బెంచిన పురుషుండె వేత్త ƒ యిలపై నగజా. 90

క॥ కులకాంతను తనకెప్పుడు
కలదంచును పెత్తనంబు ƒ గర్వమున మగం
డలుకన పరుషము లాడుచు
కలహింపుచు బాధపెట్ట ƒ కర్జమె? నగజా. 91

క॥ తనజన్మ ఫలముపొందగ
ఘనతర సన్మార్గవితతిఁ ƒ గల్గించుచు స
ద్గుణముల విద్యల నిచ్చిన
ఘనుడే గురుభూషణుండు ƒ ఘనునకు నగజా. 92

క॥ శివమంత్రము భవనాశము
శివమంత్రము నిష్టసిద్ధి ƒ చింతింపగ నా
శివమంత్రముతో సమమగు
భవహర మగు మంత్రమెందు ƒ పరగును? నగజా. 93

క॥ పరవీరశైవమందున
నరుడై నందుకును దాను ƒ నాగవిభూషున్
నిరుపమ నిష్ఠను కొలుచుచు
పురుషార్థము లందవలెను ƒ పుడమిని నగజా. 94

క॥ సార్థకమగు వాక్యంబుల
నర్థంబులు నొలుకునట్లు న్నభిరుచి పుట్టన్
మార్దవమున పలుకుచు ని
రర్థముగాకుండ నడచుటనఘము నగజా. 95

క॥ హేతువు కానక వదరుచు
వాతలఁబడు జీవివలెను బాధలబడి వి
ఖ్యాతిని బాయుట కంటెను
మూతివి బిగియించి యుండ ముఖ్యము నగజా. 96

క॥ హితులను ఖండించును, సతి
సుత సోదర వితతిఁజంపు సుజనుల నరుకున్
క్షితిపతి రాజ్యపుకాంక్షను
నతనికి పాపంబురాదె యరయగ నగజా. 97

క॥ తనజన్మ తనకు తెలియదు
తనగుణమును తెలియలేదు తనమాటలకే
గన దర్థము తన వసతిని
కనకయె నిందించు చెనటి ఘనులను నగజా. 98

క॥ యుక్తి యుపాయముచేతను
రక్తిని సత్క్రియులఁగూర్చి లక్షణముగ స
చ్ఛక్తులఁ బడసిన నరులకు
ముక్తియు లభియించు టరుదె? పుడమిని నగజా. 99

క॥ శ్రీగురు పదపద్మంబులు
భోగీశుని లింగ మాత్మ ƒ బొల్పుగ నుంచే
రాగంబుల బడకయె తా
బాగుగ చరియించు వాడె ƒ భక్తుడు నగజా. 100

క॥ మతిలో శంభుని మరువను
క్షితిలో పతిపూజబాయ ƒ సిద్ధంబటు సత్
కృతియైన వీరభద్రుని
ధృతమతి నే పొగడుచుందు ƒ నింపుగ నగజా. 101

క॥ జిలిబిలిపలుకుల పలుకుచు
కులికెడు మురిపెంపుమేన ƒ కోడల వనుచున్
లలి న న్నత్తా యనుటను
యిల నీకే కృతినొసంగి తింపుగ నగజా. 102

క॥ సిరిసంపద లనిశంబును
పరమేశుడు నీకునిచ్చి ƒ పతిభక్తియు స
చ్చరితంబును సుతసౌఖ్యము
ధరపై నీ కమరచేయు ƒ తథ్యము నగజా. 103

క॥ కృతిబొందిన నీ కవనిని
పితయును, కవిరత్న బిరుదు ƒ వేడ్కనుగని యీం
కృతిగూర్చ విద్య నేర్పిన
మతిమంతుడు నాదు నన్న ƒ మహిపై నగజా. 104

క॥ లక్కన వంశోద్భవునై
చుక్కావారింటమెట్టి § సుజనావళికిన్
మ్రొక్కులిడి వీరభద్రము
యిక్కబ్బము చెప్పె నమ్మ § యింపుగ నగజా. 105

క॥ శివుడే తండ్రియు తల్లియు
శివుడే నాకేమగడయు § శ్రీగిరి వసుడే
భవముల బాపెడి దొర యని
ప్రవిమల మతి వేడుచుందు § భక్తిని నగజా. 106

క॥ జయజయ హరినుత పాదా!
జయ జయ ప్రమథార్తి హరణ! § జయచంద్రధరా!
జయ జయ పురహర యనుచును
నియమంబున దలతుమతిని § నిక్కము నగజా. 107

క॥ మంగళమో భవహరణా
మంగళమో భక్తపోష § మాపతి రమణా
మంగళమో శివ యంచును
పొంగుచు నే పాడుచుందు § ముద్దుల నగజా. 108

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము.